The First Telugu Bi-weekly in Andhra Desa. The only Telugu Newspaper for H. E. H. The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును
హైదరాబాదు దక్కన్

103315 ~~102516~~

**Golconda Patrika. Hyderabad, Dn.**

సంపుటము ౭ { శా. శ. ౧౮౫౪ అంగీరస నామ సం॥ ర జ్యేష్ఠ బ॥ ౧౪ శనివారము 2-7-32 { సంచిక ౧౮

## సంస్థానముల ప్రజలు

వడ్లమూడి సత్యనారాయణ గారు

భారత దేశమందు నూతన రాజ్యాంగ సంస్కరణము అమలులోకి రానున్న కాలమున భారత సంస్థానముల ౭ కోట్ల ప్రజల గతియేమో తెలిసికొను టావశ్యకము.

భారత దేశపు నూతన రాజ్యాంగ విధాన మాలోచించుట కేర్పరచిన కమిటీలోగూడ సంస్థానముల ప్రజలకెట్టి ప్రాతినిధ్యము లేదు. వారికి ప్రతినిధులుగా నుండుటకు వారి పాలకులే యర్హులని యాంగ్ల రాజ్యాంగ వేత్తలు నిర్ణయించిరి. వీరు బ్రిటిషు యిండియావలెనే సంస్థానములందును గూడ వ్యవసాయమే ముఖ్యజీవనము. మైసూరు, తిరువాన్కూరు, కొచ్చిన్, బరోడా, గ్వాలియరులందు తప్ప మిగత సంస్థానములం దెన్నదగిన పరిశ్రమలు లేవు. గృహపరిశ్రమలకుకూడ తగిన ప్రోత్సాహము లేదు కూలినాలిచే పొట్టపోసుకొను జనులకు సంవత్సరమునం దాఱుమాసములు పనిలేదు అందుచే విధిలేక మిగిలిన యాఱుమాసములు పొట్టపోసుకొనుటకు బ్రిటిషు యిండియాకు వచ్చుచుందురు. సంస్థానములం దున్నంతగా లేకపోయినను బ్రిటిషు యిండియాలో మాత్రము నిరుద్యోగ సమస్య తక్కువగానున్నదా? అట్టిచో వారి దుర్భరస్థితి యూహింప శక్యముగానిది. స్వకీయమైన యాస్తిగల వారుగాని, విద్యావంతులుగాని, మేధావంతులుగాని, కొన్ని సంస్థానములందుండుట లేదు. వారు క్రమముగ బ్రిటిషు యిండియాలో స్థిరనివాసము లేర్పరచుకొనుచున్నారు. ఆ సంస్థానములందు వారి యాస్తికి రక్షణ లేదు. మేధ నుపయోగించుట కవకాశములు లేవు. వేయేల ఆ సంస్థానములందు వ్యక్తి యాదాయమునకు గాని, స్వాతంత్ర్యమునకు గాని, రక్షణలేదు. ఏక్షణమందైన నామమాత్రమగు విచారణతో నొకవ్యక్తి స్వాతంత్ర్య మపహరింపబడవచ్చును. కొన్నిసమయముల నావిచారణకూడ నుండదు.

సంస్థాన ప్రజల సగటు వత్సరాదాయము నలభై రూపాయలు; సగటు ఆయువు ౨౮ సంవత్సరములు, కార్మికులకు రోజుకు పదిగంటలు పనిజేసిన తిండికి వలయు డబ్బు దొరకును. అదియును సంవత్సరమంతయు దొరకదు ఆ డబ్బుతోనే కూలుబిడ్డల తిండి బట్టలు, తదితరావశ్యకముల సరిపెట్టుకొనవలెను. ఇక వృద్ధాప్యమందుగాని, వ్యాధిగ్రస్తులైనగాని వారిగతి చెప్పవలెనా?

నూటికి ౭౦ మందికి వ్యవసాయమే వృత్తి. మిగిలిన ౩౦ మంది యితర వృత్తుల జీవనము గడుపుదురు. వ్యవసాయకులు గ్రామములందే నివసింతురు. ఈ గ్రామములు చూడ రోతపుట్టుచుండును. ఈ లేఖకుడీ మధ్యనే రాజపుత్రస్థానమందలి కొన్ని గ్రామముల నవలోకించెను. అవి యిచ్చటి మాలపల్లెలకుగూడ సరిరావు చిన్న యిండ్లు, మట్టిగోడలు, పడిపోవుచున్న కప్పులు గలిగి జ్యేష్ఠాదేవి కావాసములై యుండును. ఇక కూడులేని వారి పరిస్థితి వేఱు చెప్పనేల, ఏమియు లేకయే యుండును ధూళి సూక్ష్మజీవికారకము వానిభరితము. వర్షకాలమందలి దుర్గ్యాన్ని వచింపనలవిగాదు. గ్రామమందు పోలీసు అధికారములు చెలాయించు కావలివాని గృహ మొకటియుండును. చిన్న దేవాలయము అనగా నొక బండయు నుండును ఊరు వెలుపల నొకవిధమగు నీరుండని చెరువుగాని, బావిగాని యుండును. వారి యాహారము ఉప్పు, మిరపకాయలు, మజ్జిగ, కాల్చినరొట్టె, బియ్యము వారికి పండుగభోజనము. కొన్నికొలది పాలిచ్చు పశువులున్నను కొన్నివేళల వాని బిడ్డలకు పాలుండవు.

...నిక తేవలెనంటే వారిలో జాతీయ నైతికభావములను నుద్బోధించుటకు విద్యాధికులైన యువకులు గ్రామములలో సంచారముచేసి ఉపన్యాసములొసంగియు మాజికులాంతరు ప్రదర్శనములను గావించియు ప్రోత్సహించవలెను. యిందులకు తగినటుల ప్రత్యేకప్రయోజన విద్యాలయములను గ్రామస్తులకు తీరికగానుండే కాలములో ఏర్పాటుచేయవలెను. యిట్టి ప్రయోజన విద్యాలయములలో బోధించుటకుగాను పాఠపుస్తకములు ప్రధానముగ నుండవక్కరలేదు. వారికి నేర్పే అంశములన్నియు వారిపరిసరములనుండే ఉపమానములతో సంభాషణ పూర్వకముగా బోధించవలయును. ౧౮ వత్సరముల వయస్సు లగాయతు ౨౫ వత్సరముల వయస్సు వరకున్న గ్రామయువకులందరిని చేర్చి అధమము 3 నెలలైన వారిని ప్రయోజన విద్యాలయము నందు చేర్చి బోధించవలయును. యీ విద్యాలయములలో మతసాంఘిక రాజకీయ నైతిక ఉపన్యాసములతో పాటు ప్రత్యేకముగా వ్యవసాయ విద్యనుగురించి ఎక్కువశ్రద్ధ తీసుకొని అందులకు తగిన ఉపన్యాసములున్ను వ్యవసాయ పరిశ్రమకు అను గుణముగానుండే తదితర గృహ పరిశ్రమలను గురించియు వాడుకభాషలో మాతృభాషలోనే బోధించవలయును.

* * *

యీ ఏర్పాటుకు గ్రామ పంచాయితీలవారు ఏ గ్రామమునకు ఆ గ్రామము మొత్తముమీద పన్నెండవ్వయస్సులోను ఎంతమంది యువకులుందురో అంతమందిని కలసికొని అందు ప్రయోజన విద్యనభ్యసించుటకు వారిలో యిష్టమున్నవారి పేర్లను తయారుచేసి యిష్టములేనివారిని ఒప్పించి 3 నెలల వరకు వీరికి విద్యను బోధించుటకు ప్రయోజనవిద్యావాలపకమున ప్రకటించి విద్యాధికులను రప్పించి వారిచే ఒక్కొక్క శాస్త్రముపై ఒక్కొక్కవారను ఉపన్యాసముల మూలమున తెలిసికొనవలయును. యిందులకుగాను ఉపన్యాసకులకు రాకపోకల ఖర్చులు మ్యాజికులాంతరు ప్రదర్శనములకు కరపత్రములకుగాను రు ౧౫౦ లు లగాయతు రు ౨౦౦ ల వరకు ఖర్చుఅగును. యీ సొమ్మును గ్రామముత్తంమీదనే సులువుగా పంచాయితీవారు వసూలు చేసి యీ విద్యాసౌకర్యములను సులువుగా పొందవచ్చును. వసనను 3 నెలలు హాజరైనయువకవిద్యార్థుల మూడు నెలల అనంతరము సంభాషణపూర్వకముగానే ప్రశ్నలనువేసి సర్టిఫికెట్లనుకూడా యియ్యవచ్చును. యీ ఏర్పాటంతయు తాలూకా జిల్లాబోర్డువారుగాని లేక గ్రామ పంచాయితీలవారుగాని చేసుకొనుట అత్యావసరమైయున్నది. దీనివల్ల ప్రజలలో సహజముగా అణగంటియున్న పౌరసత్వపుహక్కుకు జాతీయభావముకు కలికపుట్టించి మానవ సంఘమునకు సేవజేసినవారగుదురు. విద్య అనునది జన్మహక్కు. అవి విద్యను పరిపాలకులు ప్రతిపౌరునకు ఒసంగు సౌకర్యములు కలిగించవలసిన బాధ్యతయున్నది. ప్రభుత్వము కలిగించేవరకు వూరకొనక గ్రామపంచాయితీ వారైనా యిట్టిశ్రద్ధను తీసికొనవలసియున్నది.

ఆరోగ్యము వైద్యసహాయమువిషయమై గ్రామపంచాయితీలవారు ఏ గ్రామమునకు ఆ గ్రామములో ౧ మరణములసంఖ్య, ౨ పుట్టుకలసంఖ్య ౩ రోగులలో యేయే రోగమువల్ల ఎంతమంది చనిపోవునది, ఎంతమంది బాధపడుచున్నది, ౪ వైద్యసహాయము ఏరీతిగా పొందుచున్నది. ౫ వైద్యుల లో శాస్త్రీయజ్ఞానము గలవారివ్వను లేక నామకార్థం వైద్యుడని పేరుపెట్టుకొనినవారివల్ల వైద్యమునేయించుకొనేది తెలిసికొని వీటిలో నుండే లోపములకు దగిన ఏర్పాట్లు చేయవలసియున్నది. యీ పరిశీలనవల్ల తయారుచేసిన అంకెలవల్లను తదితర లోపములను బహిరంగముగా గ్రామప్రజలకు వెల్లడించి అందులక్ష్యగాను నివారణోపయోగకరమను ఆరోగ్య, వైద్యశాస్త్రజ్ఞులచే మాజికులాంతరు ప్రదర్శనములు ఉపన్యాసములు యిప్పించుటకు శ్రద్ధబూనవలసియున్నది.

రానురాను మనము బీదతనమునకు వచ్చుచున్నాటుల యీ దిగువ అంశములవల్ల తెలియగలదు డాక్టరు మాన్ అనుఆయన బొంబాయి రాజధానిలో గ్రామ ఆర్థిక విచారణచేసి తెలిపిన పుస్తకమునందు ౧౭౭౧-వ సంవత్సరమున ఆ రాష్ట్రములో దామాయిషాను ప్రతివానికి ౪౦ యకరముల భూ వసతియుండి అందు వ్యవసాయము చేసియున్నటులను ౧౯౧౫ నకుఅవనతి ౭ యకరములవరకు తగ్గిపోయినటులను ౧౦ యకరములు వసతిగలవారు గ్రామజనాభాలో నూటికి ౮౧ మంది గలరనియు ౫ యకరములు వసతిగలవారు నూటికి ౬౦ మంది గలరనియు తెల్పెను.

యీ వసతిగలవారి ఆస్తిని వారి కుటుంబములవారు పంచుకొనగా 729 విభాగములు అయినటులను అందు 433 గురికి వక యకరమునకు తక్కువగానే వాటాలువచ్చినటులను 112 గురికి యకరములో నాల్గవవంతే వచ్చినటులను తెలిపెను. చెన్నరాజధానిలో డాక్టరు స్లాటర్‌గారు వ్రాసిన ఆర్థికపు విచారణ గ్రంథముపట్టి గ్రామానికి దామాయిషాను 1882 సం॥రంలో రు 10 కిస్తీని చెల్లించెవారు 113 గురున్ను 1916 సం॥లో యీ సంఖ్య 336 వరకు పెరిగి పోయినటులను బంగాళా రాజధానిలో తామ్సన్‌గారు జేసిన విచారణనుబట్టి దామాయిషాను వ్యవసాయవృత్తిగల వానికి నిమారము 2 1/4 యకరము భూవసతిగలదనియు యిందులో కూడాను యింకా విభాగములగుచున్నదనియు వ్రాసెను. యీ విభాగములవల్ల వ్యవసాయవృత్తికి భంగము కలుగుచున్నది. యిందువల్లనే దారిద్ర్యము హెచ్చు అగుచున్నది. వ్యవసాయవృత్తిలో సాలీనా 150 రోజులుకన్న ఎక్కువ పనిలేదని పంజాబు రాష్ట్రములో పనిచేసిన సివిలు ఉద్యోగి అయిన కాల్వర్టుగారు చెప్పినటులను పనిలేని కారణమున్నను దారిద్ర్యము హెచ్చు అగుచున్నది యింతలకు తోడు వ్యవసాయదారులు తమ వృత్తికి పెట్టుబడికిగాను జమీందారులవద్ద, షావుకారులవద్ద, వ్యాపారులవద్ద, సాహుకార్లవద్ద, పెట్టుబడికి ప్రోనోట్లు తనఖాలు వ్రాసి డబ్బు తెచ్చుటయు ఆ డబ్బుకు హెచ్చు వడ్డీ వేయడము వలను రైతు నానాటికి క్రుంగి శాశ్వతముగానుండే ఋణమునకు పాలగుచున్నాడు. పండిన పంటనైనా రైతు స్వాయముగా ధర వచ్చువరకు ఆగకుండా డబ్బుకక్కుర్తికై జట్టీలకచ్చి అమ్మడంవల్ల తక్కువ ధర వచ్చుచున్నది. యీలాభము మధ్య దడారీవర్తకులు పొందడం కలుగుచున్నది. ఇందులకు తోడుగా మన దేశపు పంటలను యితర దేశముల పంటతో పోల్చిన యెంత తక్కువగానున్నదో తెలియగలదు.

దీనినిబట్టి మన స్థితి తెలియును యీ దారిద్ర్యముమున్నల్ల మనకు తిండిలేక మనలో చాలమంది తక్కువ వయస్సులోనే చనిపోవు చున్నారు. ఇంగ్లండులో దామాయిషా ఆయుర్దాయము 1901 లగాయతు 1910 వరకు తీయగా 48 వత్సరములున్నది. అదేవత్సరములలో మన దేశములో తేల్చగా 27 సంవత్సరముల ఆయుర్దాయమే మానవునకు వచ్చినది, ఇందులకు గ్రామస్తులు ప్రత్యేక శ్రద్ధను వహించి యీలోపములకు ఏలా తీర్చుకోవలెనో యోచింప వలసియున్నది. అంత వరకు గ్రామ వాసులకు ముక్తిలేదు. యీస్థితిలో నున్న గ్రామస్తులు చెల్లించే శిస్తులను పట్టణసౌకర్యములకై వెచ్చించుచుండుట ప్రస్తుత ప్రభుత్వవిధానమునందిమిడియున్నది. 1919 సం॥రం యొక్క సంస్కరణల విధానమునుబట్టి వ్యవసాయశాఖ, ఆరోగ్య వైద్యశాఖ రాష్ట్రీయ పరిపాలనలో మంత్రుల అధీనము చేసినను గ్రామాభివృద్ధి ఎంతవరకు జరిగినదో గ్రామవాసులే యోచింతురుగాక!

గత జనాభా లెక్కల ప్రకారము ( 1931 ) వ్యవసాయ వృత్తివల్ల నూటికి 71 మందిన్ని గ్రామములలో నూటికి 90 మందియు నివసించుచున్నటులను సాలీనా ఆదాయము వ్యవసాయదార్లలో దామాయిషా మనిషికి రు. ౩౩లు అనియు 1000 కి 59 గురికే చదువు తెలిసినదిగదా యీ స్థితిలో లోకల్ బోర్డు అను మంత్రి లోకలుబోర్డుల సభ్యులు వ్యవసాయశాఖ పరిశ్రమలశాఖ ఆరోగ్యశాఖ విద్యాశాఖ పరిపాలించు మంత్రులు పలుమారు సంప్రతింపులతో ఏ రాష్ట్రమునకు ఆ రాష్ట్రములో గ్రామపునర్నిర్మాణమునకై ప్రత్యేకముగ శ్రద్ధవహించి గ్రామాభివృద్ధికై గ్రామపంచాయితీని ప్రాధాన్యముచేసి దానిద్వారా ఏమి చేయవలెనను అంశమును గురించి సభజరిపి అందు ఒక ప్రణాళికను తయారుచేసి ఆప్రణాళికను అమలులో నుంచుటకు తగిన కృషిచేయవలసి యున్నది.

గ్రామ పునర్నిర్మాణపు సేవజేయుటకై యిందుకొరకు రాజను హేంద్రవరమున రామదాసుకో ఆపరేటివ్ ట్రయినింగు స్కూలులో జూలై 5 వ తేదీ లగాయతు డిశంబరు ౨౧ వరకు 1 ఆర్థికశాస్త్రము 2 ప్రభుత్వవిధానము 3 ప్రభుత్వవిధానము 4 కోఆపరేషను 5 వివిధశాఖలవారు కుటుంబములవారు ఉపదేశ లెక్కల విధానము 6 లోకల్ బోర్డుల ఆక్టు 7 ఇకనామిక్సు 8 ఆంధ్రభాష మున్నగు వాటిని గురించి నొక ప్రణాళికను తయారుచేసి 80 మందివిద్యార్థులకు ట్రయినింగు మాతృభాషలో యిచ్చి పరీక్షలు జరపడమైనది. స్వదేశీ వస్తు పరిశ్రమల ప్రదర్శనమును ఏర్పాటు చేసిరి. 1 గ్రామ ఆర్థికపరిస్థితి విచారణ ప్రశ్నావళి అనబడు సైజున 8 పేజీలలోను 2 వ్యవసాయకుని లెక్కల పుస్తకము అనబడుసైజున 15 పేజీలలోను తయారుజేసి వీటిని గురించి నేర్పడమైనది, యీ 2 బుక్కులు ఒక్కొక్కటి 2 అ॥ చొప్పున కావలసినవారికి ఆస్కూలువారు యిచ్చెదరు విటిని ప్రతి గ్రామ పంచాయితీ వారు తెప్పించుకొని వీటిని గురించి గ్రామస్తులకు బోధించెదరుగాక. యీ తరబీతుఅయిన విద్యార్థులను గ్రామ పునర్నిర్మాణమునందు శ్రద్ధవహించే పంచాయితీలవారుగాని తాలూకా బోర్డులవారుగాని వీరిని గ్రామ పునర్నిర్మాణపు సూపరువైజర్లుగా నియమించి గ్రామాభివృద్ధికై సేవజేయుటకు తోడ్పడుదురుగాక!

---

# పల్లెటూరి ప్రజల నివేదనము

## అచ్చంపేట

(ఒక విలేఖరి)

### అచ్చంపేట ప్రాథమిక పాఠశాలాభివృద్ధికై జరిగిన విద్యాసభ

మహబూబునగరం జిల్లా అమరాబాదు తాలూకాలో చేరిన, అచ్చంపేట గ్రామ పాఠశాలయందు అలీజనాబు మౌలానా మౌల్వీసయ్యద్ మొహమ్మద్ జవ్వాదు సా॥ బి ఎ. బి టి (యిన్స్పెక్టరు) మొహతెమీమ్ సా॥ గారి రాక సందర్భమున ఈ గ్రామ పాఠశాల మందిరమున అలీజనాబు మౌలానా మౌల్వీకమాలొద్దీన్ సా॥ బి ఎ ఎల్ ఎల్ బి, మున్సిఫ్ (న్యాయాధిపతులు) అమరాబాదగారి యాధ్యక్షత చే జయప్రదముగా జరిగెను. పాఠశాల మందిరము చిత్రపటములచే నలంకృతమై మిరుమిట్లు గొల్పుచుండెను పాఠశాల యందలి (ఫర్నీచరు) కూర్చుండు బల్లలు కుర్చీలుకాక న్యాయస్థానమందలి బల్లలు మొదలగు పరికరములుకూడ తేబడినను సభ కరుదెంచినవారు లెక్కకు మిక్కిలిగాయుండుటవలన చాల మంది సభ ముగియువరకు నిలచి ఏకమనస్కులై ఉపన్యాసములు వినుచుండిరి పాఠశాల బాలురు కలసి సభకేతెంచినవారి సంఖ్య (౩౦౦) మించియుండెను.

ప్రారంభమున మ. రా రా. బీ. రామచంద్రారెడ్డి హెడ్మాస్టరు అచ్చంపేటగారు ఈ సభకు అలీజనాబు మౌల్వీ కమాలొద్దీన్ సా॥ బి ఎ ఎల్ ఎల్ బి అమరాబాద న్యాయాధిపతులు తేగియుందురని తెల్పుచు వారు అధ్యక్షపీఠ మలంకరించ ప్రార్థించిరి జనాబు సయ్యదు యిమామొద్దీన్ సా॥ న్యాయవాదిగారు బలపరచిరి. ......... న్యాయాధిపతులు అధ్యక్ష స్థానమును వహించ ...... శ్రీ ...... ప్రభువు గారి రూపపటమును పుష్పమాలలచే నలంకరించి తదనంతరం కరతాళధ్వనులచే అధ్యక్షులను పుష్ప మాలాలంకృతులుగా నొనర్చి వారి సాధ్యక్షస్థాన మలంకరింప జేసిన తదుపరి సర్దారలి అబ్దుల్ మజీదుఖాన్ కిష్టయ్యయను బాలురు దైవరాజ ప్రార్థనాగీతముల నతి మృదుమధుర స్వరమునబాడి సభాసదు లమనంబుల రంజింపజేసిరి.

విద్యవలన లాభములనుగూర్చి మౌల్వీషేకు అహమదు సా॥ అసిస్ టెంటుమాష్టరు అచ్చంపేటగారు ఉర్దూ భాషయందు నిపుణతగా నుపన్యసించి జనులను విద్యాభివృద్ధికై ముందంజవేయునట్లు ప్రార్థించిరి. జనాబు మౌల్వీ యిమామొద్దీన్ సా॥ న్యాయవాదులును విద్యావిషయమై సరళ మృదుమధుర వచనంబులచ గంభీరోపన్యాసము నిచ్చిరి తదనంతరము ఈ గ్రామ పాఠశాల స్థాపించినది మొదలుకొని నేటి వరకు ఎట్లు క్షీణాభివృద్ధుల గాంచిన ముఖ్య విషయములు మ. రా. శ్రీ. బీ, రామచంద్రారెడ్డి హెడ్మాస్టరు స్కూల్ అచ్చంపేటగారు వినిపించిరి. తదనంతరం మహబూబునగరం జిల్లా విద్యాశాఖ యిన్స్పెక్టర్ గారగు జనాబు సయ్యదు మొహమ్మద్ జవ్వాదు సాబు బి ఎ బి టి గారు ఉపన్యసించుచు పాఠశాలల యందు (ఫోర్ ఫండ్) బీదబాలుర సహాయ్యనిధిని స్థాపించవలసిన అవశ్యములు దానివలన లాభముల నుగూర్చి ఉపన్యసించిరి.

మ రా. రా శ్రీ జి. బుచ్చాచారిగారు న్యాయవాదులు బీద బాలుర సహాయ్యనిధిని గూర్చి విపులముగ నుపన్యాసము ఉర్దూ భాషయందొసంగి గ్రామస్థుల మనంబులందు ఈ నిధి నేర్పాటు చేయు నభిలాష కలుగునట్లు చేసిరి ప్రేక్షకులందు ౩/౪ భాగము హిందువులుండుటచేత వీ. నరహరి అసిస్టెంటు స్కూల్ మాష్టరు అచ్చంపేటగారు బీదబాలుర సహాయ్యనిధిని గూర్చి మృదుమధుర వచనములచే తెనుగునందు ఉపన్యసించి ఈ నిధిలాభము నుగ్గడించి యిదివరకు భూగ్గకర్షకులగా నిటనిధిని స్థాపించి ఫలమునుభవించు సభ్యులకొన్ని దే శ్యముల ఉదాహరణలు తప్పకతప్పకనిధి నేర్పరచ [illegible] స్థాపించిరి

అధ్యక్ష మహాశయులు [illegible] ఉపన్యాస [illegible] బీదబాలుర సాయనిధినిగూర్చి చర్చించి పైవారల నూచనల ఉపన్యాసములను బలపరచిన వెనుక మౌల్వీషేకు బా [illegible] అసిస్టెంటు స్కూల్ టీచర్ అచ్చంపేటగారు మహా [illegible] వహించిన, హెచ్ ఇ. హెచ్. శ్రీ నైజాం ప్రభువరేణ్యులకును వారి దారసుతబంధు మిత్రాముల కపరిమిత ఆయురారోగ్యము లొసంగి రక్షింపజగదీశ్వరు ప్రార్థించిరి ప్రేక్షకులందరు తథాస్తు అని కరతాళధ్వను లొనర్చిరి తదనంతరము ఈ గ్రామ వర్తకులును తదితరులును చేరి (౯౩) రూపాయల వాగ్దానము బీద బాలురసహాయ్యనిధికి యొసంగిరి. పిమ్మట సభకేతెంచిన వారికి తాంబూల పుష్పాదికములచే బహూకరింపబడిన తదుపరి సభ జయప్రదముగా (౧౧) గంటలు రా॥ వరకు సమాప్తమును జెందెను. బీదబాలుర నిధికి వాగ్దానమొసగిన వారి నామము లీక్రింద పొందుపరచనైనది

| | | |
|---|---|---|
| (౧) | మ. రా. శ్రీ జి. బుచ్చాచారి గారు న్యాయవాదులు రు, | ౧౦ |
| (౨) | ,, పెద్ది రుపతయ్యగారు వర్తకులు ,, | ౧౦ |
| (౩) | ,, బూశి పర్వతాలుగారు దేశాభిమానులు, | ౧౦ |
| (౪) | ,, మిర్యాల నారాయణగారు వర్తకులు ,, | ౧౦ |
| (౫) | ,, వెంకట రామయ్యగారు వర్తకులు పొల్కంపల్లి ,, | ౧౦ |
| (౬) | ,, పోకల శేఖరయ్యగారు దే॥ అ॥ ,, | ౧౦ |
| (౭) | ,, పోకల రామలింగయ్యగారు దే॥ అ॥ ,, | ౧౦ |
| (౮) | మౌల్వీ మిర్జా యిబ్రాహింబేగ్ సా॥ న్యాయ॥ ,, | ౧౦ |
| (౯) | మ. రా. గుముడవెల్లి బాలయ్యగారు వర్తకులు ,, | ౫ |
| (౧౦ | ,, గోపగొండు బాలలింగయ్యగారు కా॥అ॥,, | ౫ |
| (౧౧) | ,, లప్పర్తి రంగారెడ్డిగారు దే॥ అ॥ , | ౫ |
| (౧౨) | మౌల్వీ యిమామొద్దీన్ సా న్యాయవాదులు ,, | ౨ |
| | మొత్తము రు | ౯౨ |

## రుద్రారంకోట

(స్వకీయ విలేఖరి)

### కాలస్థితి

ఎండలవేడిమి తగ్గినది మృగశిరా ప్రవేశము నుండి యును కొలదిగనో గొప్పగనో వర్షించుచునే యున్నది మ్రొ క్కజొన్న తలలు నూపుచున్నవి. రైతులు మొక్కజొన్న ము న్నగు పునాసపైరులను వేసుకొనుటకు పొలములను సిద్ధపరచు కొను చున్నారు

### కాల్లువనుట

ఇటీవల యెవరోకొందరు దుండగులు రాత్రులందు కొందరి యిండ్లపై రాళ్లువేయుట మొదలిడిరి. ఈరాళ్లను దొంగలువేయుచున్నారని కొందరు తలంపసాగిరి దయ్యములు వే యుచున్నవని కొందరు వాదింపసాగిరి. కడకు నాలుగైదు రోజుల వరకు రాళ్లుపడెను గాని అనంతరమేమియు లేదు

### చిన్న దొంగతనము

మా గ్రామ పటువారీగారగు మ॥ పలివెల లింగయ్యగారి జొన్నల కొట్టు తాళము తీసి యెవరో జొన్నలను అపహరింప దలంచిరి ఆంతలో వర్షము కురియ మొదలిడినందున కొట్టుదగ్గర పడుకున్న కావలివారలు మేలుకొనుటచే జొన్నలను తీసుకొనిపోవుటకు వీలుగాక గంపలను అక్కడనే వదలి పారిపోయిరి కావలివారలు లేచిచూడగా కొట్టుతలుపులు తెరచియున్నవి ఒకగంప జొన్నలతోడను రెండుగంపలు ఖాళీగాను వున్నవి జొన్నలరాసి పైనకొన్ని పదచిహ్నములు గూడ వున్నవి తెల్లవారగానే యీ విషయమై పోలీసు అమీన్ సా॥ గారికి దరఖాస్తు యివ్వబడినది గంపలు దొరకుటచే దొంగలు త్వరలో పట్టుబడుదురని తలంపబడు చున్నది

### టీకాలు

పాల్వంచ సంస్థానము లోకల్ ఫండు శాఖవారిచే నియమింపబడిన వేక్సినేటరు శ్రీయుత శెల్లకొండ కృష్ణమూర్తి గారు మా గ్రామమునకు వచ్చి సుమారు యాభైమందికి మశూచికపు టీకాలు చేసినారు.

### గోదావరి పుష్కరిణి

జూన్ ౨౭ వ తేదీన గోదావరికి కొంచెము నీరుతేగెను. తెల్లవారేవరకు గోదావరి పుష్కలముగ ప్రవహించుచుండెను ఈ సంవత్సరము గోదావరి పుష్కరము అగుటచే గౌతమీతీర వాసులందరకును గొప్ప సుదినమును పావన గౌతమీ సలిలావగాహనమున నిగర కల్మషులగుట కింతకంటె మంచితరుణ మింకెపుడు లభించును గనుక హిందూ సంఘమంతయు సర్వంత సంతోషాంత రంగములతో వేచియున్నది.

---

## బొంబాయిలోని తీవ్ర పరిస్థితులు

### హిందూ ముస్లిముల గలాటాలు పోలీసువారి కాల్పులు

గత ౨౫ వ తేదిని బొంబాయిలో ఉత్తరభాగమందు గోల్పీఠమునకు సమీపముగా హిందూ ముస్లిముల గలాటా లేకెత్తుచున్నవని వినినంతనే పోలీసువారు లారీలో బయలుదేరి యిచ్చటికి వెళ్లిరి లారీని చూచినంతనే ముస్లిములు చెలరేగి రాళ్లు రువ్వసాగిరి. పోలీసువారంతటు కూడదని యెన్ని మారులు హెచ్చరించినను మానరయిరి వేఱుమార్గములేక పోలీసువారు ముస్లిము గుంపుపై రెండుమారులు కాల్చిరి ఒక్కడు మాత్రము గాయపడెననియు సంక్షోభము గోల్పీఠమునకు ప్రక్కవీధుల ప్రాకి వాతావరణమును అతీవ మొనరించెననియు దుకాణములన్నియు మూతపడెననియు తెలియుచున్నది.

### గలాటా వివరములు

౨౫ వ తేదీ రాత్రియే రెండుపక్షుల యాన్దోళనము విజృంభణము ప్రకోపమునుబట్టి చూడ సంక్షోభ మధికతరమయ్యెడిది భగవత్సంకల్పమున పోలీసులు మధ్యజొచ్చి గుంపులను పలాయన మొనరించిరి కాని ఆయ్యది అంతటితో సమసినదికాదు. మరుదినము ప్రాతఃకాలముననే హిందు ముస్లిము గుంపులు యేర్పడి ఒకరిపైనొకరు రాళ్లు రువ్వనారంభించిరి సూర్యకిరణ ప్రసరణ మధికమగు కొలది రాళ్లవర్షమధికమగుచుండెను మధ్యాహ్నము రెండు గంటలకు గలాటా మరిరేగెను. పైనజెప్పబడినట్లు పోలీసువారి రాకయు కాల్పులు జరిగినవి వాతావరణ మంతట సానుకూలమునకు వచ్చెనని తలచిరేకాని రాళ్లురువ్వుట సంపూర్ణముగ నాగినదికాదు కత్తులతో పొడుచుకొనిరి. రాళ్లు రువ్వుటచే గాయబడినవారయిననేమి కత్తిపోటులచే గాయబడినవారయిననేమి మొత్తముమీద యిరువురు మహమ్మదీయులు పదిమున్గురు హిందువులు ఆసుపత్రికి పంపబడిరి.

తుపాకి దెబ్బతిగిలిన మహమ్మదీయునిగూడ ఆసుపత్రికి పంపిరి ఇతరచోట్ల ప్రదేశమునందు కలవరములేదు. దుకాణములు మూసిరి ఓపలు నొడుబడినవి పోలీసు దళము సాయుధులై ఆ ప్రదేశమునందు కవాతు జేయుచున్నారు ఆ చోట ట్రాం రాకపోకలను నిలిపివేసిరి

౨౬ వ తేది పెందలకడనే ౪ గంటలకు బయ్యాల్లీ గొల్లవాడ్ర సిద్ధరిని మహమ్మద్ అలీరోడ్డుమీద పోవుచుండగా వారిని పొడిచిరి దానిమీదట అల్లరులు తీవ్రరూపము దాల్చ నారంభించినవి. రెండీబజారు చుట్టు ప్రక్కల యొక్క ప్రదేశమునను గలాటాలు ప్రబలినవి పోలీసులువచ్చి లాఠీలను ప్రయోగించియు తుపాకుల కాల్చియు గుంపులను చెదరగొట్టిరి గోల్పీఠ ప్రాంతమున గల దుకాణముల నన్నిటిని మూతవేసిరి. మధ్యాహ్నము రెండు గంటలకు మరియొకచోట హిందూ ముసల్మానులు కొట్టుకొనుచుండ డ్యూటీయందున్న పోలీసు ఉద్యోగి తన రివాల్వరుతో మూడుగుండ్లు కాల్చెను జనులంతట పలాయనులైరి యెవ్వరును గాయపడలేదు. మూడవసారిగా మరల హిందూ ముస్లిము గుంపులుచేరి రాళ్లు రువ్వుకొనసాగిరి. పోలీసువారు ౫ వరుసలు తుపాకులు కాల్చిరి తక్షణముగ మువ్వురు గాయపడిరి. ఈవిధముగ నాటిసాయంత్రము ౫-౩౦ గంటలవరకు జరుగుచుండిన అల్లరులలో ఒకడు మరణించెను ౨౪ మంది గాయపడిరి వీరిలో రివాల్వరుచే గాయపడినవారు నల్గురనియు, కత్తిపోటుచే గాయపడినవారు ఆర్గురనియు తెలియుచున్నది మగల నార్తు బ్రూకులో టలవద్ద హిందువులు, ముసల్మానులపై రాళ్లురువ్వి వారిని నాశముచేసి పారద్రోలిరి అప్పుడు పోలీసువారు వచ్చిహిందువులపై లాఠీల ప్రయోగించిరి అందువలన ప్రయోజనమేమియు లేనందున, ౧౫ వరుసలు తుపాకులు కాల్చిరి, ౭ మంది గాయపడిరి ఆయా ప్రాంతముల యెడ యెడను పడిన గుంపులు అచ్చటనే కొట్టుకొను చుండిరనియు, పోలీసు బలము ఆధిక మొనరించ బడెననియు, వినవచ్చెను. అటు పిమ్మట మరికొంత సేపటికి యీకలవరము మిల్లుప్రాంతమునకు వ్యాపించినది. హిందూ కూలీలు ముసల్మానులపై బడి కొట్టిరి వెంటనే పోలీసులు వచ్చి లాఠీలతో చెదరగొట్టిరి మిల్లు ప్రాంతము ప్రశాంతముగనే వుండినట్లు వినుచున్నాము. మొత్తముమీద నాటి అర్ధరాత్రిలోపల యిద్దరు మరణించిరి. ౧౦౦ మంది గాయపడిరి వీరిలో ౧౨ మందికి గుండుదెబ్బలును, ౬ రుకు కత్తిపోట్లును తగిలెను. మరణించిన వారిలో నొకడు గుండుదెబ్బచేతనే ప్రాణములు గోల్పోయెను. పోలీసులు సాయుధులై మోటారు లారీలలో గస్తు తిరుగుచునే యుండిరనియు ౬౦ మంది అరెస్టు జేసిరనియు తెలియుచున్నది.

